

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035685

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ మల్లేశ్వరపరబ్రహ్మణేనమః

# శ్రీ మల్లేశ్వర శతకము



మావుడూరు శ్రీశైలమల్లికార్జునరావు.
(సుందరాపురవాస్తవ్యులు)
గ్రంథకర్త

ప్రథమముద్రణము
1000 ప్రతులు.

**1932.**

రామకృష్ణ ముద్రణాలయము
శ్రీకాకుళము.

---

 [వెల రు 0—4—0 లు

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 16 | లక్షణంబుయందు | లక్షణంబునయందు |
| 4 | 12 | వితాముల్ | వితానముల్ |
| 9 | 1 | సేయు | సేయు |
| 14 | 11 | జ్ఞానగగమ్యుఁడ | జ్ఞానగమ్యుఁడ |
| 15 | 4 | తద్రిడిలి | తంద్రిడిలి |
| 20 | 3 | నదవదీసరిపబ్ధి | నదనదీసరిదబ్ధి |
| 21 | 18 | రక్షింప | శిక్షింప |
| 24 | 2 | లోకైకర్త | లోకైకకర్త |
| 25 | 2 | చాతుమంటి | చాటుచుంటి |
| 28 | 2 | దత్య | దైత్య |
| 30 | 10 | లక్షిని | లక్ష్మిని |
| 30 | 13 | చాపంబు | చాపంబు |
| 32 | 5 | సేయుచు | సేయుచు |
| 35 | 2 | కాన్చనములు | కార్చనములు |
| డిటో | 3 | మోష | మోక్ష |
| 39 | 10 | గిరీశ | గిరిశ |
| 38 | 16 | తాంత | శాంత |
| 40 | 3 | మాశ్రితబగు | మాశ్రితంబగు |
| 42 | 16 | మయ్యే | మయ్యో |
| డిటో | 18 | త్యస్వోమ | త్యస్వామ |
| 43 | 7 | సంపతారి | సంపత్కారి |
| 44 | 11 | సఖియయు | సఖీయయు |
| 49 | 7 | కల్పకాల్ప! | కల్పకాకల్ప |
| డిటో | 13 | పరవాస్త | పరవాస్త్ర |
| 54 | 20 | నసెంచి | సెంచి |

తొలిపలుకులో 5వ పంక్తిలోఁగల్పనాకల్పశిల్పంబునకుబదులు కల్పనానల్ప శిల్పంబునని చదువుకొనవలెను.



# శ్రీమల్లేశ్వరశతకము.

శ్రీసర్వమంగళా ♦ సీమంతినీమనో
రమణీయకమలాక ♦ రరవిబింబ!
సంతతధ్యాన ని ♦ ష్ఠాభక్తతత్పర
మానసమానస ♦ మానసౌక!
నానామునిశిరోమ ♦ ణీనవ్యరుచిజాల
తరుణార్కనీరాజి ♦ తపదపద్మ!
శరణాగతత్రాణ ♦ గురుకృపానవసుధా
సారబంధురనేత్ర ♦ నారసయుగ!

గీ॥ వారణాననసంసేవ్య! ♦ ప్రమథ నాథ!
భక్తహృద్ధామ! సురసార్వ ♦ భౌమ! భీమ
సుందరశరీరరుచిజిత ♦ కంద! సుంద
రాపురనివేశ! మల్లేశ్వ ♦ రా! మహేశ!

సీ॥ తెలికిచెర్లాన్వయ ♦ తిలకుని మద్గురు
విద్వద్వరేణ్యుని ♦ వేదవిదుని
బుధపుంగవు రాము ♦ మూర్తిశాస్త్రిని గొల్చి
యిలువేల్పులకు నుతు ♦ లిడి మదీయ
జననీజనకులకు ♦ వినతులు గావించి
బుధపురోహితవర్గ ♦ ముల భజించి
కవివర్గమునకెల్లఁ ♦ గరములు జోడించి
యష్టమూర్తిని నిన్ను ♦ నభవుఁ దలఁచి
గీ॥ సీసశతకంబు నీమీఁదఁ ♦ జెలువుమీఱఁ
జెప్పఁగడఁగితి ముదమారఁ ♦ జిత్తగింపు

సీ॥ అరయసంస్కృతభాష ♦ నభ్యసింపఁగలేదు
శాస్త్రవిచారంబు ♦ సలుపలేదు
ఆంధ్రప్రబంధంబు ♦ లారయఁగాలేదు
గద్యకావ్యంబులు ♦ గాంచలేదు
వ్యాకరణంబునఁ ♦ బాండితిగనలేదు
లక్షణంబు యందు ♦ శిక్షలేదు
ఆంగ్లభాషనుస్వల్ప ♦ మరయఁగల్గితిఁగాని
యందునఁ బ్రౌఢిమ ♦ నందలేదు
గీ॥ నీకృప నెట్లొ కవనంబు ♦ నేతు నదియు
నసదని తలంపకనుకంప ♦ నరయు మీవు.

సీ॥ పాండితీపరిణతి • పటిమఁ గైతలు సెప్పి
నట్టి బాణాదిక • వ్యగ్రణులును
నాంధ్రభారతకర్త • లై పెంపునొందిన
తిక్కనాదికవీంద్ర • ధీమణులును
లలితప్రబంధవి • లాసముల్ గొనిన పె
ద్దనముఖాద్యఖిలస • త్కవివతంసు
లనఘభక్తిప్రబో • ధార్థ శతకని
ర్మాణచాతురిఁ గన్న • మహితభక్తు
గీ॥ లనని వెలసిరి; యట్టిస • త్కవులమ్రోల
నేననఁగ నెంతవానుతుల్ • కృపఁ గ్రహింపు ౪

సీ॥ పద్యకల్పనలేమి • హృద్యముల్ గావన్నఁ
జింతనొందకనిన్నె • చింతసేతుఁ
బదసౌష్ఠవంబును • గుదురఁగలేదన్నఁ
జింతనొందకనిన్నె • చింతసేతు
సంధిసమాసముల్ • సందిగ్ధములటన్నఁ
జింతనొందకనిన్నె • చింతసేతు
నన్వయసారళ్య • మలవడదనియన్నఁ
జింతనొందకనిన్నె • చింతసేతు
గీ॥ సర్వమునునీవగదసుర • సార్వభౌమ!
మంచిచెడ్డలునీయంద • యుంచినాఁడ. ౫

సీ॥ శ్రీగిరిజార్థాంగ ! చిన్మయ ! భవదూర!
సాంబ ! సదాశివ ! శంభు ! శరణు!
మూర్తిత్రయేశ్వర ! ముక్తిదాయక ! హర!
సాంబ ! సదాశివ ! శంభు ! శరణు
త్రిభువనపరిపాల ! త్రిపురాసురాంతక!
సాంబ ! సదాశివ ! శంభు ! శరణు
బాణాసురావన ! భవభూతి ! సురసేవ్య!
సాంబ ! సదాశివ ! శంభు ! శరణు
గీ॥ కలుషమతినగు నన్నుఁ గావు • గరము భక్తి
నిన్నుఁ గొలిచెద సతతంబు • నిగమవేద్య! ౬

సీ॥ మల్లేశ్వరస్వామి • మదినివసించినఁ
బాపవితానముల్ • బాయఁగలవు
మల్లేశ్వరస్వామి • మదిఁదాండవించిన
భయదజాడ్యంబులు • వాయఁగలవు
మల్లేశ్వరస్వామి • మదినిదలంచిన
బుత్రసంపత్తులఁ • బొందనగును
మల్లేశ్వరస్వామి • మనమునవిహరింప
నఖిలసుఖంబులఁ • నందనగును
గీ॥ అహహ! నిన్మదిసేవింప • నఖిలజనము
లైహికాముష్మికసుఖంబు • లందఁగలరు ౭

సీ॥ శ్రీకరమోక్షుల ♦ క్షేమనొసంగుశివ! నిన్ను
స్మరియింపస్థైర్యంబు ♦ మనసుగనదు
దివ్యగంగాస్రవం ♦ తిని బూనుశివ! నిన్ను
నుడువంగ జిహ్వాయు ♦ జడతఁగనును
ఖండచంద్రికిరీటు! ♦ గంగాధరా! నిన్ను
వీక్షింపఁగన్నులు ♦ పేడుసేయు
నభవ! యాశ్రితజన ♦ ప్రభు! చంద్రధర! నిన్నుఁ
బూజింపఁగరములు ♦ యోజసెడును
గీ॥ గాఢతిమిరౌఘుపరివృత ♦ మూఢమతిని
సత్కృపాసుధనాపయిఁ ♦ జల్లుదేవ! ౮

సీ॥ సిరులనెన్నియొభక్త ♦ పరులకొసంగియుఁ
బుఱుకపేరులువీత్రిఁ ♦ బూనినావు
భర్మచేలంబులు ♦ భక్తులకొసఁగియుఁ
గరటిచర్మముమేనఁ ♦ గట్టినావు
వెలలేనిసౌధంబు ♦ లిలభక్తులకునిడి
ప్రేతకుంభినిఁ ♦ బ్రీతి నెలసినావు
అమరవర్యులకెల్ల ♦ నమృతంబొసంగియుఁ
గాలకూటముమ్రింగి ♦ కాచినావు
గీ॥ కలిమిగలిగియువైరాగ్య ♦ ఘనతనొంది
లేమినటియించిభక్తుల ♦ నోముచుందు. ౯

సీ॥ శిరసునఁబెంజడల్ ♦ కరనాగ బంధముల్
జడలనుశశిపువ్వు ♦ మెడను బాము
లొడలిపై భస్మంబు ♦ నడుమునఁగరితోలు
పై వ్యాఘ్రచర్మంబు ♦ భస్మముద్రి
చెవులరుద్రాక్షలు ♦ చేతముమ్మొనవాలు
కప్పెరడమరముల్ ♦ గలిగెదీవు
జోగివేసముగమఁ ♦ జోద్యమైకన్పట్టు
నాదిభిక్షుండ! లోప ♦ మరయవైతి
గీ॥ బత్తి బంధాలనీపాద ♦ పంకజములకు
నామనోమర్కటముఁగట్టి ♦ నన్నుఁబ్రోవు ౧౦

సీ॥ ఇంటఁగట్టెలులేవొ ♦ యిల్లాలువండదో
పరగృహంబులభుక్తి ♦ జరుపఁజూతు
కప్పెరలేదొకో ♦ కాసైనలేదేమొ
భిక్షకై పుఱుకలు ♦ ప్రీతియేమొ
కట్టబట్టలులేవొ ♦ చెట్టునారలులేవొ
బిరుసుచర్మంబుపైఁ ♦ బ్రీతియేమొ
తైలమించుకలేదొ ♦ తలరాచుటకునీకు
పెంజడల్ధరియింపఁ ♦ బ్రీతియేమొ
గీ॥ లేనివాఁడవొయుండియు ♦ లేదొస్వామి!
సర్వమొసఁగంగభక్తులె ♦ సాక్షులభవ! ౧౧

సీ॥ కాలకూటవిషంబు ♦ గళమధ్యమునఁదాల్పఁ
దారకాపతిఁదలఁ ♦ దాల్చినావొ
ఫాలనేత్రాంచిత ♦ పరమేశ్వరుఁడవౌట
గంగనుజడలందుఁ ♦ గలిగినావొ
భుజగహారంబులఁ ♦ బూనుకతమ్మున
భస్మధరుండవై ♦ పరగినావొ
ఛత్రహీనుండవై ♦ చరియించుకతమునఁ
బులితోలుపలెవాటు ♦ పూనినావొ
గీ॥ భక్తులకునిత్యదర్శన ♦ ప్రాప్తిగలుగ
భిక్షునిపోల్కి తిరిగెదు ♦ మోక్షదాత! ౧౨

సీ॥ శివునిధ్యానించెడు ♦ చిత్తమ్ముచిత్తమ్ము
పురహరుమ్రొక్కెడు ♦ శిరముశిరము
శ్రీహరునర్చించు ♦ చేతులుచేతులు
శ్రీకంఠుఁబేర్కొను ♦ జిహ్వజిహ్వ
త్రిణయునఁజూచెడు ♦ దృష్టులుదృష్టులు
పరమేశునుతియించు ♦ వాణివాణి
శంకరుకథలాను ♦ శ్రవణముల్‌శ్రవణము
లభవుగేహముఁద్రొక్కు ♦ నంఘ్రియంఘ్రి
గీ॥ యిట్లునిరుపమభక్తిని ♦ నెన్నుపుమఁగొల్చు
వారలకుమోక్షసామ్రాజ్య ♦ పదవిగలదు ౧౩

సీ॥ తినుటకుఁ గంచము ♦ దిక్కుమాలిన పుఱ్ఱె
యంగరక్షణకుఁ జ ♦ ర్మాంబరములు
సేవకబృందంబు ♦ చెడుపిశాచవితాన
ముగ్రస్మశానంబు ♦ నునికిపట్టు
సంచరించెడు కాల ♦ మెంచంగ నడిరేయి
మాలికలరయఁగ ♦ పాలచయము
భూషలు భీకర ♦ భుజగసంతానంబు
నాత్రిశూలమె నీకు ♦ వేత్రమొప్ప
గీ॥ మంగళాభావసూచక ♦ సంగివయ్యు
మంగళాకరుఁడౌటనీ ♦ మహిమ దెలుపు ౧౪

సీ॥ ఉత్తమాంగంబున ♦ నుత్తుంగవాహిని
జడలడిగ్గెడు నెడఁ ♦ బొడము రవమొ
ప్రచండతాండవయుత ♦ భక్తహస్తంగత
శంఖవిశేషసం ♦ జనితరవమొ
వేదచతుష్టయ ♦ వేదిసన్మునిబృంద
పఠితమంత్రావళి ♦ వఱలు రవమొ
ప్రబలహర్షావేశ ♦ భవ్యలీలానృత్య
సమయసంగీతప్ర ♦ విమలరవమొ
గీ॥ ధారుణీచక్రభ్రమణసం ♦ తతరవంబొ
మేరుదెలియంగనేర్తురోం ♦ కారరవము ౧౫

సీ॥ అరవిందమకరంద • మాస్వాదనముసేయు
భ్రమరినీనామమం • త్రముజపించుఁ
బరిపక్వమధురామ్ర • ఫలములభక్షించు
కోయిలనీపేరె • కూయుచుండుఁ
దృణజకీటకతతిఁ • దెచ్చివత్సలఁజేయు
పక్షినీకీర్తన • మఱువదెపుడు
సతతంబునీపదా • శ్రితసారసంగీత
సాలంబునీకియి • సరవిఁబాడు
గీ॥ ధరణిజీవులధ్యానని • ధానమీవె
ధ్యానసులభుఁడవీవెపు • రాసురారి! ౧౬

సీ॥ భూధరాగ్రమునెక్కి • పున్నాగములుదెచ్చి
పూజలొనర్పంగఁ • బూనవలెనె?
విపినాంతమునకేగి • విరజాదిపూల్దెచ్చి
నినుసమర్చింపంగ • ఘనతగనునె?
యతిగభీరాంబుమ • ధ్యస్థపద్మంబులు
దెచ్చినీకర్పింపఁ • దెలివియగునె?
యతులకంటకలతా • వృతమాలతులఁదెచ్చి
నియతినిన్బూజింప • నెమ్మియుండె?
గీ॥ నవనవోన్మేషవాసనా • నందదంబు
నుత్తమంబగుహృత్పద్మ • మొకటెచాలు ౧౭

సీ॥ చిత్తశుద్ధియులేక ♦ శ్రీశైలమేగినఁ
బాపముల్వాయునె ♦ పార్వతీశ!
కలుషాత్ములై యుండి ♦ కాళహస్తినిజేర
నిన్నెఱుంగఁగలరె ♦ నీలకంఠ!
యాశాపరికాంక్షులై ♦ కాశికిఁబోయిన
నీమహత్వమెఱుఁగ ♦ నేరరభవ!
కామవికారులై ♦ రామేశ్వరముఁజేరఁ
గైలాసమొదవునే ♦ ఫాలనేత్ర!
గీ॥ సంతతమునీదుస్మరణమా ♦ వంతయైనఁ
జేయువానికిసర్వంబుఁ ♦ జేతనుండు ౧౮

సీ॥ విత్తమబ్బినఁదన ♦ విపులబోధను దెల్పుఁ
గానుపోయిననిన్నుఁ ♦ గఁలిపెట్టు
సుతులఁబొందినఁదన ♦ సుకృతకారణమను
విగతాసుఁడైననిఁ ♦ బొగిలితిట్టు
నారోగ్యమబ్బిన ♦ నదియదృష్టంబను
రోంపగల్గిననిన్ను ♦ రోసితిట్టుఁ
బ్రభులమెప్పులుగల్గఁ ♦ బటుబుద్ధియుతుఁడను
నిందఁబొందినఁగుంది ♦ నిన్నుఁదిట్టు
గీ॥ నెవ్విధంబుననిందల ♦ కెల్లనీవు
మేలునకువారు; దుష్టుల ♦ లీలలివియ ౧౯

సీ॥ కుదురుమనసు లేక ♦ గుడికిఁబోవుట యేల?
నీతియించుక లేని ♦ నియమమేల?
యాత్మశుద్ధియు లేని ♦ యభిషేచనం బేల?
దైవచింతన లేని ♦ ధ్యానమేల
నీపరంబునఁగాని ♦ దీపంబిడఁగ నేల?
భావస్థిరత లేని ♦ భక్తి యేల?
పూర్ణమనము లేక ♦ భోగమియ్యఁగ నేల?
నిండుభక్తియు లేని ♦ దండమేల?
గీ॥ మనుజులకుఁ జేటు నినుమఱ ♦ మానితిరుగ
నిత్యచింతన నిన్ను ధ్యా ♦ నింపవలయు ౨౦

సీ॥ సంసారదుస్తర ♦ సాగరంబందున
నాశాతరంగము ♦ లావరింపఁ
దనువను తరణిలో ♦ ఘనభోగపరుఁడయి
యాత్మభూపతి విలా ♦ సార్థమేగ
నింద్రియవితతుల ♦ హీననావికులౌచు
గరచరాంగములచేఁ ♦ గడపుచుండఁ
బాపపుంబెనుగాలి ♦ ప్రబలి యానంబును
బడవేయ నుంకింప ♦ భయముఁగొనియు
గీ॥ నిన్నుఁ గూరిచి మొఱలిడి ♦ సన్నుతింప
నీవకారణకృపఁ బూని ♦ ప్రోవరావా! ౨౧

సీ॥ ఆహారనిద్రాలం • దవనీతియుక్తులై
రోగంబులను మెండు • ప్రోగుచేసి
నిత్యకర్మలుమాని • సత్యమున్విడనాడి
దుష్టసంచారభూ • యిష్టులగుచు
భయభక్తులనువీడి • పాపకృత్యములెన్నొ
చేయుచునల్పులౌ • జీవులయ్యుఁ
బాపపుడై వమీ • పాటుదెచ్చెనటంచుఁ
బరుషంబులనుబల్కుఁ • బాడియగునె
గీ॥ యెన్నికష్టములొదవిన • నిన్నునేక
చిత్తమునఁగొల్వనన్నియుఁ • జెదరిపోవు ౨౨

సీ॥ కర్మమారంభింపఁ • గలుషహారణ! నీదు
కరుణగల్గినఁగదా • జరుగనగును
గానసాఁగుటకునార్త • కోటిరత్నామణి!
నీచూడ్కి ప్రాభచేత • నెగడనగును
వన్నెగాంచుటకును • సన్నుతచరిత! నీ
దాక్షిణ్యమునఁగదా • తనరనగును
సంపూర్తివడయంగ • సదమలహృదయ! నీ
పూర్ణవీక్షణములఁ • బొందనగును
గీ॥ యెట్టికృత్యముసేయంగ • నెట్టుకొనిన
నిన్నుధ్యానింపనవలెలఁ • జెన్నుఁగాంచు ౨౩

సీ॥ మల్లేశ్వరుండని ♦ మల్లికార్జునుఁడని
సోమేశ్వరుఁడని ♦ సోముఁడనియు
రామలింగేశ్వర ♦ భీమలింగేశ్వర
విశ్వేశ్వరులనియు ♦ నీశ్వరుఁడని
మండలేశ్వరుఁడని ♦ యొండలీశ్వరుఁడని
నీలకంఠుండని ♦ కాలుఁడనియు
భువనేశ్వరుండని ♦ ముఖలింగుఁడనియును
గుక్కుటేశ్వరుఁడని ♦ కోటిలింగ
గీ॥ మనియునానావిధాఖ్యల ♦ నన్నిచోట్ల
వెలయులింగస్వరూపుఁడ ♦ వేల్పునీవె ౨౮

సీ॥ మహితసంపన్నుండు ♦ మామపర్వతరాజు
విఖ్యాతపుత్త్రుండు ♦ విఘ్నరాజు
షణ్ముఖుండలదేవ ♦ సైన్యంబునకురాజు
ప్రాణసఖుండల ♦ రాజరాజు
తలపూవసమకాంతి ♦ విలసిల్లుద్విజరాజు
నేసాఁ తేరును ♦ వృషభరాజు
పరివిమలహారంబు ♦ పన్నగరాజును
సేవాపరుండల ♦ దేవరాజు
గీ॥ సన్నిధినిగొల్వనష్టైశ్వర్యములను
నలువలరునీకుభిక్షాట ♦ నంబదేల? ౨౯

సీ॥ శ్రీవిష్ణువనినిన్నుఁ ♦ జెలఁగివైష్ణవతతి
కైంకర్యమొనరించుఁ ♦ గరముభక్తి
బ్రహ్మవీవనినిన్నుఁ ♦ బ్రాహ్మణాదులుభక్తి
ధ్యానంబొనర్తురు ♦ మానసముల
భాస్కరుండనినిన్ను ♦ భాస్కరోపాసకుల్
గాంతిపుంజంబుఁగా ♦ జింతురెలమి
శంభుండవనినిన్ను ♦ శైవులారాధనల్
పరమభక్తిఁబొనర్చి ♦ పరగుచుంద్రు
గీ॥ మతవిభేదములోకుల ♦ మతముగాని
యరయసర్వమునీవెదే ♦ వాదిదేవ! ౧౬

సీ॥ జ్ఞానస్వరూపుండ! జ్ఞానగగమ్యుఁడ! శర్వ!
కర్త! వృషాధిప! హర్త! శంభు!
ఋగ్యజుస్సామప ♦ రీత! సర్వమయుండ!
లింగస్వరూపుండ! సంగరహిత
నిధిపతిసన్మిత్ర! నిత్యతేజోరూప!
యోగీశ్వరేశ్వర! యోగగమ్య!
వారిజగర్భుండ! పరమాత్మ! శివరూప!
యాత్మస్వరూప! దే ♦ వాదిదేవ!
గీ॥ సర్వసంవ్యాప్త! శాశ్వత! సర్వరూప!
నిన్నునుతియింతుఁబ్రోవుమా ♦ నన్నుదేవ! ౧౭

సీ॥ పుట్టినపసిపాపఁ • బోషించి పాలిచ్చి
దాదివై పెంచెడు • దాతవీవ
కష్టసుఖములందు • నిష్టభోగములిచ్చి
రక్షించు తండ్రివి • ప్రభుఁడవీవ
విమలబుద్ధిజ్ఞాన • విద్యలొసంగఁగఁ
బరమదయాళుఁడౌ • గురుఁడవీవ
వాఙ్మనఃకర్మల • వఱలుదోసముఁ బాపి
పరమపదవినిచ్చు • భర్తవీవ
గీ॥ జననమాదిగ గతియించు • దనుక నన్నుఁ
బరమకృపఁ బ్రోచి పెంచెడు • పరముఁడీవె ౨౮

సీ॥ ఫలపత్రములఁ దించుఁ • బరమనిష్ఠాత్ములై
మునిలోకమేనికై • మ్రొక్కుచుండుఁ
బత్రిభక్షణులయ్యుఁ • బంచాగ్నిమధ్యానఁ
ద్యాగులెవ్వానికై • తపమొనర్తు
రంబులుగ్రోలుచు • నంబుమధ్యమునుండి
ఋషివర్యులెవనిస్మ • రించుచుంద
రనిలాశులై యుండి • తనువులుజీర్ణింప
జటిలతతియేనికై • జపమొనర్చు
గీ॥ సిద్ధులెవ్వానిరూపంబుఁ • జింతసేతు
రట్టినినుఁ గూర్చి వేడెద • హర్షమొప్ప ౨౯

సీ॥ మనుజుఁడు తాఁజేయు ♦ ఘనపాపసంతతుల్
మహినిరోగములయి ♦ మారుచుండు
దుష్కృతబలముచే ♦ దురితమైయొప్పారు
లేశకల్మషము వే ♦ లీనమగును
ఇహపరంబులయందు ♦ నేమేమిచేసిన
నాయాయి ఫలముల ♦ నందనగును
వైద్యశిఖామణుల్ ♦ వరుసనెందరొచేరి
వానినివర్తింపఁ ♦ బూనఁగలరె
గీ॥ వైద్యుఁడనఁగను త్రిభువనా ♦ వనుఁడవీవె
నిన్నుధ్యానింపఁగల్గును ♦ నిఖిలసుఖము 30

సీ॥ సచ్చిదానందాత్మ! శంకర ♦ భర్గుండ!
తేజస్స్వరూప! జి ♦ తేంద్రియుండ!
యేకాక్షరాకార! నాకలోకప్రభూ!
ఆకారరహితుండ! యమరవంద్య!
యంధకాసురహర! యంబామనోహర!
త్రిపురాంతకుండ! శ్రీ ♦ త్రిభువనేశ!
భవబంధహర! హర! పంచముఖుఁడ! దేవ!
నాగాభరణ! రుద్ర! యోగసంగ
గీ॥ నిత్య! నిర్మల! శుద్ధాత్మ! నిర్వికార!
నిరుపమైశ్వర్యగణసేవ్య! నిన్నుఁగొలుతు 31

సీ॥ స్వర్గాదిలోకస • త్సౌఖ్యప్రదాతవు
యాచనకై యుండ్ల • కరుగుచుండ
సర్వమయుండవు • సర్వజ్ఞమూర్తి వి
పశుపతివనిపిల్వఁ • బడుచునుండ
సకలలక్ష్మీనాథ! సర్వేశ్వరుండవు
భూతేశుఁడవి పేరు • పొందియుండ
నిర్మలాత్ముండవు • నిష్కాముఁడవుదమి
నర్ధాంగమునఁగాంత • నదిమియుండ
గీ॥ నీవిలాసవై చిత్రిని • నెఱినెఱుంగ
సురలకైననుగాదన్న • నరులకగునె? 3౨

సీ॥ పగలులౌకికయంత్రి • పరతంత్రితనుమున్న
పరమేశ! నీపూజ • జరుపకుందు
నజ్ఞాననిద్రిన • న్నావరింపఁగఁ జేయు
సర్వేశ! నీపూజ • సల్పకుందు
సాంధ్యకాలంబులఁ • జల్లగాలికిఁబోయి
శ్రీకంఠ! నీపూజ • సేయకుందు
మజ్జనాశనముల • మధ్యవేళలయందు
జగదీశ! నీపూజఁ • జలుపకుందు
గీ॥ నిట్టియసమర్థుఁడగునన్ను • నేవిధమున
రక్షసేసెదొ నీ దెభా • రంబుసుమ్ము 33

సీ॥ తనువశాశ్వతమిలఁ • దగనిన్ను సేవించు
టొక్కటేనిలుచును • నిక్కువముగ
ధనధాన్యసంపదల్ • తరలుటసిద్ధము
నీకృపమాత్రమె • నిలిచియుండు
బంధుసంబంధంబు • పరికింపశూన్యంబు
నీకటాక్షముమాత్రె • నిలిచియుండు
నఖిలభోగంబులు • నరయంగమిథ్యలు
నీదయాసారంబ • నిందితంబు
గీ॥ నిన్ను నమ్మిననాకేమి • బన్నమిలను
నీపదాక్రాంతుఁడగునాకు • నీవెదిక్కు ౩౪

సీ॥ సాంధ్యకర్మము • దీర్పనైపదుహృదయంబు
నుపవాసములఁజేయ • నోర్పులేదు
నీనామపఠనంబు • నేరదురసనంబు
నశ్రితములోనన్యాస • స్మృతియులేదు
నీలీలలాలింపఁ • గాలేవువీనులు
దీర్థయాత్రలుసేయఁ • దెఱపిలేదు
సంకీర్తనకుఁబోవ • సంభ్రమింపవుగాళ్లు
పూజలొనర్పంగ • బుద్ధిలేదు
గీ॥ తలఁపనధమాధముండనఁ • దగిననన్ను
నేవిధంబునఁగాచెదో • దేవదేవ! ౩౫

సీ॥ కంకేళిపల్లవా • గ్రవిలాసముభజించు
తతజటాటవినాక • తటినియొప్ప
హీరహారపటీర • సాంద్రకాంతిజయించు
సితదేహమున భూతి • చెలువుమీఱ
సలలితజ్యోత్స్నల • సద్దీప్తులరహించు
శశిమహాళితటమున • సరసమాడ
నమృతధారాపరీసా • రములనువహించు
కరుణాకటాక్షవీ • క్షణములొలయ
గీ॥ సచ్చిదానందసామ్రాజ్య • సరసపదవిఁ
దేలుచునటించునిన్నుమ • దిందలంతు ౩౬.

సీ॥ సకలజీవులకును • సాక్షివై జ్ఞానంబు
ప్రసరింపఁజేయుప్ర • భాకరుఁడవు
జాతిభేదములేక • నీటనినెలకొల్పి
పంకాంధతమసముఁ • బాపుశశివి
దుర్బలత్వమువాపి • దుర్ఘటేప్సితములఁ
గరుణనొసంగెడు • కల్పకమవు
ప్రకృతివైచిత్ర్యచ్ఛ • భావమెఱింగింప
సర్వవిద్యాలసంగు • సద్గురుండ
గీ॥ వైననినువంటిపెన్నిధి • యమరనన్య
దైవతాశ్రయమరయుంగఁ • దప్పుగాదె ౩౭

సీ॥ సంపూర్ణకళలతో ♦ జాహ్నవిజడలందు
నింపుసొబగుతోడ ♦ నెమ్మినొంద
సుందరకళలతో ♦ సోముండుశిరమున
మల్లికాస్తబకంబు ♦ మాడ్కిఁదనర
సకలకలావిలా ♦ సంబుపెంపారఁగాఁ
బార్వతిసామేనఁ ♦ బరఁగవిల్ల
సర్వకళామూర్తి ♦ సామజవదనుండు
దక్షిణాంకతలానఁ ♦ దనరుచుండ
గీ॥ విశ్వరక్షైకవృత్తిమై ♦ వెలయునిన్నుఁ
గొలిచెదనుమోక్షలక్ష్మిచే ♦ గూరుకొనను ౮౦

సీ॥ కారుచీఁకటివల్ల ♦ కాటిలోఁజరియింప
ద్విజరాజుతావక ♦ దీపమేమొ?
నమరేయినొంటిమై ♦ నడయాడవెనువెంట
నుండుపిశాచముల్ ♦ దండులేమొ
భువనంబులెల్లను ♦ బొడఁగాంచుటకుసూర్య
చంద్రముల్ దలఁపంగఁ ♦ జక్షులేమొ
స్వాహాప్రియునిఫాల ♦ భాగాననునుచుట
చెచ్చెరఖలుల ♦ రక్షింపనేమొ
గీ॥ యవధిఁగాననినీమము ♦ హోమహిమము
నెఱుఁగుటకునాదృశులకును ♦ దరమెదేవ ౮౧

సీ॥ భువనత్రయీపాప ♦ పుంజంబుఁగడుగునా
కలసాగరులదివి ♦ కనుచుటెంత
చంద్రశేఖరుశిర ♦ స్థలినుండఁదగిననా
కలహైమవతిగర్వ ♦ మడఁచుటెంత
యఖిలదైత్యధ్వంసి ♦ యంఘ్రిఁబుట్టిననాకు
నలరసాతలసీమఁ ♦ దోలుచుటెంత
మధురామృతాకృతి ♦ మహినెసంగెడునాకు
నలయమృతోత్పాదిఁ ♦ గొలుచుటెంత
గీ॥ యనిమహావేగమునడిగ్గు ♦ నభ్రగంగ
ధృతిజటాజూటమునఁదాల్చి ♦ తివిగదయ్యా! ౪౨

సీ॥ సచరాచరజగత్ప్ర ♦ చయమునంతయుఁజేసి
సంతుష్టినొందెడు ♦ జలజుఁడవు
చేసినసృష్టిఁబో ♦ షింపనంచత్కృపా
వీక్షణంబులఁజూచు ♦ విష్ణుమూర్తి
నవలనంతయునుల ♦ యంబొనరింపఁగాఁ
గోరిధైకమూర్తివౌ ♦ రుద్రుఁడీవ
యంతనేకార్ణవ ♦ మందుఁజిదానంద
మెంతయుఁగనుపర ♦ మేశ్వరుఁడవు
గీ॥ పెంపఁబాలింపనొంపవి ♦ ధింపఁగర్త
వైతనరునిన్నుఁగొలిచెద ♦ నమరవంద్య! ౪౩

సీ॥ అలతారకానికా ♦ యంబునెన్నఁగవచ్చు
నీలీలఁ దెలియఁగరాదు ♦ జాలజభవ!
వర్షధారలనైన ♦ వసుధలెక్కిడవచ్చు
నీగుణగణమెంచ ♦ నేరదేవ!
భూరజస్సముదాయ ♦ మునుగణింపఁగవచ్చు
నీమహిమంబెన్న ♦ నేర్వగిరిశ!
సకలాగమవితాన ♦ సారంబెఱుఁగవచ్చు
నీతత్వమెఱుఁగరా ♦ నేరమీశ!
గీ॥ శ్రుతులు సైతము నిన్నునె ♦ ఱుంగవనఁగ
నేననఁగనెంతనన్ను న ♦ త్కృపఁగణింపు ౪౪

సీ॥ వనధిఁజేరిననదుల్ ♦ వెనుకకేగనియట్లు
మరలిన దినములు ♦ తిరిగిరావు
జలజాప్తుకరముల ♦ జలములింకిన భాతి
కాలతీక్ష్ణతచేతఁ ♦ గలుగుమ్రుతియు
భవనంబు శిథిలమై ♦ యవనిఁగూలినరీతి
ముదిమినొందినతనువు ♦ పుడమిఁగలియుఁ
బక్వఫలంబులు ♦ బడిబడినగతి
మర్త్యులప్రాణముల్ ♦ మసలిచనును
గీ॥ వెలుఁగుగలతఱిసర్వంబు ♦ వెదకవలయుఁ
జేవగలయప్డునీసేవ ♦ చేయవలయు ౪౫

సీ॥ సకలజీవులయెడ ♦ సమరీతివర్తిల్లు
లోకైకకర్తము ♦ లోకభర్త!
యాధారమదిలేని ♦ యాకాశమునసంచ
రించుఖగంబులఁ ♦ బెంచెదీవ
యానికేమియులేని ♦ పానీయములమీన
కమఠాదిజంతులఁ ♦ గాచెదీవ
ప్రాణవాయువులేని ♦ స్థాణువునందుండు
కప్పలరక్షించు ♦ ఘనుఁడవీవ
గీ॥ పుడమిజీవకోటులకెల్లఁ ♦ బోషకుఁడవు
సర్వరక్షకబిరుదంబు ♦ సాక్ష్యమిందు ౮౬

సీ॥ ఇచ్చకంబులనిన్ను ♦ మెచ్చిపొగడలేన
యర్థాశచేనిన్ను ♦ నడుగలేను
లేనిగొప్పలనెన్ని ♦ పూనివ్రాయఁగలేదు
కోర్కెలిమ్మనుచుఁబే ♦ ర్కొనఁగలేద
యతిశయోక్తులనెన్ని ♦ నుతిసేయఁగాలేదు
బిరుదులకైనిన్నుఁ ♦ బిలువలేదు
స్తుతిపాఠకునిగనీ ♦ చొప్పుచెప్పఁగలేదు
చెనఁటిమెప్పులకునా ♦ సింపలేదు
గీ॥ మోక్షలక్ష్మీకటాక్షవి ♦ స్ఫురణగలుగ
నిన్ననిశంబుఁగొలిచెద ♦ నీలకంఠ ౮౭

సీ॥ వేసము వర్ణించి ♦ దోసమెంచుటగాదు
సమహితత్వము భువిఁ ♦ జాటుమంటి
బిచ్చగాఁడవనుచు ♦ రెచ్చగొట్టుటకాదు
భక్తలోలుఁడవంచుఁ ♦ బలుకుచుంటిఁ
గాటికాపరివని ♦ మోటులెన్నఁగలేదు
ముక్తిదాతవటంచు ♦ మురియుచుంటి
వృషభవాహనుఁడని ♦ వెక్కిరించుటగాదె
యతిదయామయుఁడంచు ♦ నలరుచుంటి
గీ॥ నీదులీలావిలాసంబు ♦ నెఱిఁ దెలిపితిఁ
గినుకపోనాడి నన్నావ ♦ వినుతి సేతు ౭౮

సీ॥ ఆలోకకంటకుఁ ♦ డౌరావణునకును
వరములొసఁగినట్టి ♦ పాపముద్ర!
శోణపురాధీశు ♦ బాణాసురునకును
ద్వారపాలకుఁడైన ♦ ధీరచరిత!
యలహిరణ్యాక్షుఁడై ♦ త్వత్స్వామికిని మహా
సత్వంబునొసఁగిన ♦ సదయహృదయ!
కృపయనట్టిదో ♦ యెఱుఁగనిసరభోజి
వితతినైన ననుగాచు ♦ విమలచరిత!
గీ॥ యేమినెఱుఁగని మర్త్యమా ♦ యిడుమని నన్ను
నీదుభక్తునిరక్షింప ♦ నేరవయ్య! ౭౯

సీ॥ శారదనారద ♦ నారదశారదా
పారదఘనసార ♦ వరపటీర
హీరహారతుషార ♦ సారసుధాసార
సారగంగానీర ♦ జారికాశ
సంకాశసితదేహా! శంకర! చంద్రశే
ఖర! పార్వతీమనో ♦ హర! యనంత!
వృతజటాజూటాట ♦ వీధృతసురనదీ
రంగదుత్తుంగత ♦ రంగసంఘ!
గీ॥ యనుచు ననిశంబు నిన్ను నే ♦ యనఘభక్తి
పరులు సేవింతురో ముక్తి ♦ వరులు వారు ౫౦

సీ॥ శివనామపఠనంబు ♦ శ్రేయస్కరంబిహ
పరములయందుఁ జీ ♦ వతతికెల్ల
శివకథామృతమును ♦ జెవులసోఁకినయెడఁ
బాపసంచయములు ♦ వాయుచుండు
శివభక్తవరులద ♦ ర్శించినంతనె సర్వ
కలుషపంకావళిఁ ♦ గడుగనగును
శివమంత్రజపితలఁ ♦ జేరి సేవించిన
దుఃఖాంధతమసము ♦ దూరమగును
గీ॥ శివుని భూయస్త్వమెఱుఁగంగఁ ♦ జెందు సుఖము
శివుఁడ నశుభావహుండవఁ ♦ జెలఁగు దేవ! ౫౧

సీ॥ అరుణోదయస్నాన • మాచరించియుబూది
పట్టెలమొయినిండఁ • బెట్టివింత
జడముడితగవైచి • జపమాలధరియించి
కావిబట్టలనుసిం • గారమూని
పుడమినవతరింపఁ • బూనినసిద్ధుఁడో
యనఁగరూపాతిశ • యమును[illegible]
వంచకయతివేష • సంచరులకునీదు
పదసన్నిధినిజేర • వలనుపడునె
గీ॥ వేషభాషలవిడనాడి • విమలమతిని
భక్తుఁడగువానినరయించు • ముక్తిలక్ష్మి ౫౨

సీ॥ భూసురుండొక్కఁడి • మ్మహినీదుపూజలఁ
గమనిష్ఠతోఁజూత • నడపుచుండ
బోయతిన్నఁడటకుఁ • బోయిచెప్పులనీదు
తలనున్నపూలనా • వలనువైచి
పుక్కిటసలిలసం • ప్రోక్షణమొనరించి
పూవులనావెన్కఁ • బూజసేసి
ఘోరమాంసమిడఁగై • కొనినీవుభక్షింప
భూసురుఁడాశ్చర్య • మునమునుంగ
గీ॥ భిల్లకునిభక్తిశ్రద్ధల • నెల్లఁజూపి
భక్తిమార్గంబుఁజూపిన • ప్రభుఁడవీవ ౫౩

సీ॥ ఆదివిష్ణువునృసిం ♦ హావతారమునహి
రణ్యకశిపుదైత్య ♦ రమణుఁదునిమి
యుగ్రరూపమునస ♦ ముజ్జ్వలంబుగనొప్ప
నాదిత్యవితతులో ♦ య్యనభజింప
శరభరూపమునసీ ♦ వరుదెంచుకతనన్నృ
సింహదేవుఁడుశాంతిఁ ♦ జెందనపుడు
నిన్నునృసింహుని ♦ మన్ననల్ గావించి
సురలుగ్రిమ్మఱనిండ్ల ♦ కరుగలేదె
గీ॥ శరభమృగరూపధారి! యో ♦ శాంభవీశ!
నీదులీలలనెఱుఁగంగ ♦ నేరదేవ! ౫౪

సీ॥ కమలనాభుఁడువేయి ♦ కమలంబులనునిన్నుఁ
బూజించివరములఁ ♦ బొందలేదె
కమలోద్భవుఁడుతపో ♦ గరిమనునిన్గొల్చి
వ్రితసమున్నతుఁడయి ♦ వఱలలేదె
జంభారిమొదలుగ ♦ సకలదేవగణంబు
నిన్గొల్చిపదవుల ♦ నెగడలేదె
యక్షగంధర్వవి ♦ ద్యాధరుల్ తావక
సేవాఫలంబులఁ ♦ జెందలేదె?
గీ॥ అతితరానంతభక్తిని ♦ న్నాశ్రయించు
మనుజునన్గావనీవెస ♦ మర్థుఁడవుగ ౫౫

సీ॥ శ్రీగౌరిసామేనఁ ♦ జెందిసేవింపంగ
నభ్రవాహినిశిర ♦ మందు వెలయఁ
గ్రొన్నెలమకుటంపు ♦ వన్నెలంబచరింప
సర్వాధిపతిఫణా ♦ చమకింపఁగఁ
జామరహస్తులై ♦ సభఁబుత్రులిర్వురు
ప్రమథులతోడన ♦ పర్యసేయ
సన్మునిరాజుల ♦ సన్నుతుల్ సడయుచు
మణిగణావిలసిత ♦ మండపమున
గీ॥ రజతగిరిఁగల్పకమునీడ ♦ రాణమొఱయ
నింపుకొలువుండిమమ్మేలు ♦ నిన్నుఁగొలుతు ౫౭

సీ॥ కనఁజక్షువులుమఱి ♦ వినఁగర్ణముల్ చనఁ
గాళ్లుమఁజేఁతకై ♦ కరములొసఁగి
తినుటకునోరును ♦ తెలివికిజ్ఞానంబు
నన్నవస్త్రాదులై ♦ న్నెన్నొసఁగి
యంధత్వబాధిర్య ♦ కాదివైకల్యముల్
సెందనీయకసుఖ ♦ మందఁజేసి
పశుపక్షికీటక ♦ భవములొందఁగనీక
మానుషజన్మంబుఁ ♦ బూననిచ్చి
గీ॥ యన్నివిధములఁగాపాడు ♦ చున్ననన్ను
మదినినెలకొల్పిపూజలే ♦ మరకచేతు ౫౮

సీ॥ కరుణారసాపాంగ ♦ గిరితనూజార్ధాంగ!
భవలతాళిలవిత్ర! ఫాలనేత్ర!
మేరుభూధరచాప! ♦ దారితాశ్రితపాప!
త్రిపురవిభంగ! వా ♦ రిధినిషంగ!
గూఢపాదాకల్ప! కోవిదజనకల్ప
భక్తజనాధీన! వరనిధాన!
బాణాసురత్రాణ! పద్మలోచనబాణ!
చంద్రచందనకీర్తి! చంద్రమూర్తి!
గీ॥ యనుచు ననిశంబు నినుఁగొల్చు ♦ నట్టిభక్త
జనులకొసఁగెదు మోక్షుల ♦ శ్రీమనిగిరీశ! ౫౮

సీ॥ సర్వసర్వంసహా ♦ చక్రంబు రథముగాఁ
జంద్రసూర్యులు రథ ♦ చక్రములుగ
జాంబూనదధరంబు ♦ సవ్యచాపంబుగా
నాగాధినాథుండు ♦ నారిగాఁగ
దైత్యసంహారిమా ♦ ధవుఁడాశుగంబుగా
నగ్నిహోత్రుండు బా ♦ ణాగ్రముగను
జలజసంజాతుండు ♦ సారథిగాఁగ స
త్ప్రణవమంత్రంబు వే ♦ త్రంబుగాఁగ
గీ॥ బూని త్రిపురాసురులఁ గెల్చి ♦ భువనములకు
శాంతి నెలకొల్పి రక్షించు ♦ శంకరుండ! ౫౯

సీ॥ గంగాతరంగిణీ ♦ రంగదుత్తుంగత
రంగవాయుకిశోర ♦ సంగతిం గని
వారాణసీపురీ ♦ భర్మహర్మ్యవితాన
రాజవీథీవిహా ♦ రంబుగాంచి
యాచకరక్షణా ♦ హ్వానతత్పరవిశా
లాక్షీమహాదేవి ♦ భిక్షనొంది
యఖిలదేశాయాత ♦ నిఖిలతైర్థికసమా
చరితపూజార్చనా ♦ సమితిం బొంది
గీ॥ కాశికాక్షేత్రసౌఖ్యసం ♦ గతులుగాంచి
వెలయువిశ్వేశ్వరునినిన్నుఁ ♦ గొలుతుభక్తి ౬౧

సీ॥ గార్హస్థ్యమూనిన ♦ తత్కర్మముల్ బొనరింప
నలఘుమోక్షపదంబు ♦ గలుగుననియు
సర్వభూతంబుల ♦ సమహితత్వమునూన
బరమముక్తిపదంబు ♦ దొరకుననియుఁ
ద్యాగంబుచేనైన ♦ ధర్మంబుచేనైన
నపవర్గపదవిదా ♦ నందుననియుఁ
గర్మసన్న్యాసంబు ♦ గావించి విజ్ఞాన
చింతనిర్వాణంబు ♦ చెందుననియుఁ
గీ॥ బండితులుపల్కవినియున ♦ ఖండభక్తి
యోగమునకన్నియునుగ్రింద ♦ గాఁగనెంతు ౬౨

సీ॥ కమలాక్షుఁగొందఱుఁ ♦ గమలాప్తుఁగొందఱుఁ
గొందఱుగణనాథుఁ ♦ గొందఱునిను
గొందఱుశక్తిని ♦ గొందఱన్నఁగపాలిఁ
బ్రత్యేకపరతనా ♦ రాధనంబు
నేయుచుఁబాషండ ♦ చింతనొందుదురుస్వా
మీ! వివేకంబులే ♦ మినినిజంబు
షణ్మతంబులఁగనుబా ♦ షండచింతవహింప
కున్న సన్మతములం ♦ జొనరఁబలికె
గీ॥ గురుఁడుత్వదపరమూర్తి శం ♦ కరుఁడుఘనుఁడు
సర్వరూపునినినుఁగొల్తుఁ ♦ జంద్రజూట ౬౨

సీ॥ అంకోలవృక్షంబు ♦ నాత్మబీజమ్ములు
వారాకరంబును ♦ వాహినులును
సతిలోకసౌందర్య ♦ రతినాథునిజనాథుఁ
దరుణిమానవతీమ ♦ తల్లిసాధ్వి
కమనీయలసదయ ♦ స్కాంతోపలంబును
జెచ్చెరబహులసూ ♦ చీముఖములు
లతికావితానంబు ♦ క్షితిరుహంబునుదమి
నేవిధానఁబెనఁగఁ ♦ బోవునటులె
గీ॥ దేవ! నీపాదయుగముమ ♦ దింబెనంగ
నదియభక్తియనంగఁజె ♦ న్నారుధరణి ౬౩

సీ॥ బంగరుకొండనీ • పజ్జనే యుండంగ
సొమ్ములు నీకెట్టి • సొంపుగూర్చు?
వెండికొండయు నీకు • విడిదియై యుండంగ
హర్మ్యములు నీకేమి • హాయి నొసఁగు?
మంచుకొండయు నీకు • మామయై యుండంగ
భక్ష్యభోజ్యంబులే • పరగు...?
మేఖలగిరి నీకు • మేలిఛత్రముగాఁగఁ
పట్టుగొడుగు లేమి • పనికివచ్చుఁ?
గీ॥ కొండమాలియు నీమేన • గూడియుండ
నంగసౌష్టవము నకంద • మనుగనేల?

సీ॥ ఉదయాద్రిపై భానుఁ • డుదయింప మేల్కాంచి
యర్ధార్జనకుఁ గాల • మంచుఁ దిరిగి
పశ్చిమాద్రిని జేరఁ • బడఁతులతోఁ గూడి
కామభోగములందుఁ • గాలమెల్ల
రాతిరి పగలేక • రీతివిషయచింత
రోజుచుఁ గాలమిా • యోజఁ గడపి
పోయిన కుండలోఁ • బోసిన జలముల
కరణి ప్రాణంబులు • క్షయము నొంద
గీ॥ నెఱుఁగఁజాలని మానిసి • యెన్నటికిని
నిన్నుఁ దెలిసియుఁ గొలువంగ • నిపుణుఁ డౌనె? ౬౫

సీ॥ సకలభాషాసార • సంపాదనంబున
విపులధీమంతులై • వెలసియున్న
నైశ్వర్యవితతుల • నందఁగల్గియు రాజు
భోగంబులనుసదా • పొందుచున్న
నధికారపదవీను • హత్త్వమొందియు
బహుళసౌఖ్యంబులు • వడయుచున్న
ధర్మశాస్త్రమెఱింగి • తగవులుదీరిచి
ఘనబిరుదావళుల్ • గాంచియున్న

గీ॥ నఖిలసౌఖ్యవిశేషంబు • లందియున్న
భక్తికొఱవడియున్నని • ష్ఫలముగాదె 66

సీ॥ పూటబత్తెములేక • పొట్టకూటికినిండ్ల
వెంబడిఁదిరిగెను • బిచ్చగాఁడు
దృష్టిసౌఖ్యతదేవ • సృష్టిఁగానఁగలేక
యనిశంబుదిగులొందు • నంధజనుఁడు
దీర్ఘరోగములబా • ధితుఁడౌచునిత్యమ్ము
సంతాపమునమున్గి • సాఁగుఁరోగి
చెరసాలలందును • జిరకాలముంపఁజేఁ
బలుబాములనుజెందు • బంధితుండు

గీ॥ వెతలచేనైననీధ్యాన • మతులగుటను
భూరిపదవులనొందెదు • పుణ్యులుగద 67

సీ॥ పంచమహాపాప • భయదాటవులకుదా
వాగ్నికీలలు తావ • కార్చనములు
మోహలక్ష్మీసతీ మోహాననవ్యాలా
స్యవిశేషములు తావ • కార్చనములు
నాత్మైకవేద్యచి • దానందరససుఖ
వ్యాపారములు దావ • కార్చనములు
తతసంసరణవార్ధి • తరణపాటవమహా
యానపాత్రిలు తావ • కార్చనములు
గీ॥ భూరితాపత్రయాభీల • నీరదములు
నగునుమానాథ! శివ! తావకార్చనములు ౬౮

సీ॥ వదనాంబుజంబులు • పదిమునీకిర్పింప
సన్నద్ధుఁడైనద • శాస్యుకంటె
నాత్మీయసతినైన • నర్పింపఁబూనిన
లాలితశీలిభ • ల్లాణుకంటె
నిరుపమభక్తిమై • నిజతనూపాత్రిణము
లర్పించునాసిరి • యాళుకంటె
ననితరభక్తిమై • నంబకంబులు రెండుఁ
బూనికనిచ్చిన • బోయకంటె
గీ॥ మఱియువీరవ్రతులు శైవ • వరులకంటె
నధికుఁడ నేనిసుభక్తుఁడ • న్నాదరింపు ౬౯

సీ॥ కామినీమణిఁదెచ్చి ◆ కమ్మపూఁబల్లవనంబు
కలితరతీధ్యమాం ◆ గల్యగరిమ
భువనసంరక్షణా ◆ భ్యున్నతోద్యముఁడైన
జలజాతలోచను ◆ సౌహృదంబు
మూతులుండగుచంద్రు ◆ మహితసమ్మానంబు
నిజపురందరముఖ ◆ ప్రార్థనంబు
నలసమీరవసంత ◆ కలకంఠదైన్యంబు
హైమవతీదేవి ◆ యుక్కటికము
గీ॥ కారణములుపరిధానముల్ గాఁగమదను
మరలఁబ్రదికింపఁజేసితి ◆ వరద! గిరీశ! ౨౦

సీ॥ ఒకపక్కఁ గురులు వే ◆ ఱొకప్రక్కఁ జడలును
నొకటఁ జాబిల్లియు ◆ నొకటఁ గుసుమము
నొకవంక గంధమిం ◆ కొకవంక భూతియు
నొకటఁ ఫాలాక్షియుం ◆ గొకటఁ బొట్టు
మణిహారమొకక్రేవఁ ◆ బుఱుకపేరొకక్రేవ
నొకట రుద్రాక్షయుం ◆ గొకటఁ గమ్ర
భూషణాలొకచేత ◆ భుజగంబులొకచేత
నొకటఁ జర్మంబులిం ◆ కొకటఁ జీర
గీ॥ నెడమఁబడఁతియుఁ గుడిఁబురు ◆ షుఁడును గాఁగఁ
బొలుచునర్ధనారీశ్వరుఁ ◆ గొలుతునిన్ను ౨౧

సీ॥ సారంగరక్షణ ♦ సంరక్షణంబులు
వొనరించితివి విష్ణు ♦ మూర్తి యట్లు
ఘనపుణ్యజనవిదా ♦ రణసంభరణకేళి
నెలయించి మించితి ♦ విధుని రీతి
శ్రీస్వీకరణభవ్య ♦ సేవనాంగీకృతు
లొనరఁజేసితివి వె ♦ న్నుని విధాన
సజ్జాభిభరణస ♦ మ్యగ్గూఢి నెఱపితి
వసుమతీభృద్ధారి ♦ భంగి దేవ!
గీ॥ హరికి నీకును భేదమిం ♦ తైనఁ గలదె
యట్టులరయుట మిగుల నో ♦ హంబుగాదె 22

సీ॥ తండ్రియు దాతయు ♦ దైవంబు నీవని
నమ్మినవాఁడను ♦ నెమ్మనమునఁ
బెక్కు దురితము ♦ లొక్కుమ్మడిని నన్ను
బొందనిన్నర్థి నే ♦ బ్రోవుమంటి
నీవు నంతకరుణ న ♦ న్నీక్షించి రక్షింపఁ
బంతమింకేల? నా ♦ పైని నీకు?
నీటలముంచెదో ♦ పాలలోముంచెదో
నీదె నా భారంబు ♦ నిగమవేద్య!
గీ॥ దీనుఁడను గాన నన్ గావఁ ♦ దిక్కు నీవె
కోపమిఁకనైన వీడి నా ♦ కోర్కె దీర్పు 23

సీ॥ సామేనఁజెందిన ♦ సర్వమంగళవల్లి
కామతల్లికరీతిఁ ♦ గమరహింపఁ
దశజటాజూటంబు ♦ దరుణారుణమనోజ్ఞ
పల్లవవితతుల ♦ బాగునెఱపఁ
గమనీయధవళగం ♦ గాశీకరంబులు
హృదయంగమసుమాళి ♦ యొసక మొసఁగఁ
గారుణ్యవిశ్రాంత ♦ ఘనకటాక్షవిలోక
నములుమత్ప్రదవిలా ♦ సముభజింపఁ
గీ॥ గల్పకముపోల్కిఁదనరున ♦ నల్పునిన్నుఁ
గొలిచినీచాయమనియెదఁ ♦ గుధరచాప! ౨౪

సీ॥ నవరత్నవరమయూ ♦ ఖవితానరంజిత
రాజతాచలకంద ♦ రములయందు
ఘనశిరశ్శశిచంద్రి ♦ కాధౌతకలధౌత
రమణీయమణిమంది ♦ రములయందు
బ్రాంతాలకాకాంత ♦ కాంతావిహారని
తాంతచైత్రరథాంత ♦ రాంతరముల
మానసౌకవిహార ♦ మానితమానస
కాసారతీరప్ర ♦ దేశములను
గీ॥ హైమవతిఁగూడిసరసవి ♦ హారములనొ
నర్చిచరియించునిన్నునే ♦ నర్చసేతు ౨౫

సీ॥ పురుషులుసోదరుల్ • పరకామినులుసోద
రీమణుల్ గాఁగవ • ర్తించుటయును
నలఁబొల్చునకలజీ • వులయెడసమరీతి
నెంచునాధృతినివీ • క్షించుటయు
నాగమనోదిత • వ్యాపారములుశ్రద్ధ
వెలయంగఁ దద్దఁగా • వించుటయును
భువిఁ "నహింసాపర • మోధర్మ"యనుసూక్తి
రీతిగాఁదగనాచ • రించుటయును
గీ॥ నాదిగాఁగలధర్మంబు • లనుసరించి
మెలఁగువారలెపుడమిధ • న్యులుగదయ్య ౨౬

సీ॥ తనయులఁబెక్కండ్రఁ • గనినప్పటికిఁబుత్ర
సంతానవాంఛపో • సన్నగిలదు
నిఖిలశాస్త్రజ్ఞాన • నిపుణుఁడనునదన
విద్యతోసంతుష్టి • వెలయఁబోదు
భూకుబేరుండయి • పోడసూపిననువిత్త
కాంక్షయెందంబునఁ • గదలిపోదు
సర్వోన్నతోద్యోగ • సంతోషమబ్బియు
నధికారమందలి • యాసవిడదు.
గీ॥ ఐహికాచిరవిలసితం • బైనయట్టి
భోగవాంఛలకునుహద్దు • పోల్చవశమె? ౨౭

సీ॥ ఘృతముక్షీరములసం • యుతమగుచొప్పున
నలదివాకసుఁబనిన్ • గలసియుందు
అగ్నికాష్ఠములస • మాశ్రితబగునట్లు
తపసులునీయంద • తనరుచుందు
జలములుభువియందు • గలిగియుండెడుభాతి
ద్విజులునీయందెసం • ధిల్లియుందు
శైత్యముజలముల • సంజాతమగుక్రియఁ
బంచభూతములునీ • ప్రభవెలుంగు
గీ॥ లింగలక్షణ! దేవ! నీ • లీలతెలుఁగ
నేరితరమానువివరింప • భూరితేజ! ౭౭

సీ॥ కడలికినీరముల్ • కానుకిచ్చినరీతి
నభిషేచనమునీకు • నాచరింతు
శ్రీమహాలక్ష్మికి • హేమమిచ్చినభాతిఁ
బుష్పబిల్వములనిన్ • బూజసేతు
నాజగచ్ఛక్షునీ • రాజనంబిడుమాడ్కి
నీచెంతదీపంబు • నిలువనిత్తు
వేల్పులావునకుమేఁత • వెట్టినతెఱఁగున
ఫలనివేదనలునీ • పరమొనర్తుఁ
గీ॥ జంద్రునకునూలుపోఁగిడు • చందమునను
నల్పమగునాదుకృతిఁగొను • మమరవంద్య! ౭౮

సీ॥ అందంబులకుమేటి ♦ యలకాపురంబును
బుణ్యంబులకుమూఁట ♦ భువినిగాశి
సకలవాహినులందు ♦ జాహ్నవిపావని
ధరణిజంబులరావి ♦ దురితహరము
గ్రహమండలంబునఁ ♦ గమలాప్రియుఁడుమిన్న
ధరనొప్పునరులభూ ♦ సురులుఘనులు
నగములఁగైలాస ♦ నగముశ్రేష్ఠంబల
రాత్రులలోశివ ♦ రాత్రిఘనము.
గీ॥ నఖిలసురకోటికవతంస ♦ ముభవనీవ
ప్రణవమిలమంత్రరాజమై ♦ పరిఢవిల్లు  ౮౦

సీ॥ పాకారివేణుని ♦ స్వనముగావింపంగ
నలువరాణియువీణ ♦ నెలమిమీట
సిరియుగానవిశేష ♦ శృంగారమునుజూపఁ
గమలనాభుఁడుమృదం ♦ గముధ్వనింపఁ
జతురాననుఁడుతాళ ♦ చతురతఁజూపంగ
భక్తులెల్లరునుతుల్ ♦ పఠనసేయ
సుతులుదేవగణంబు ♦ సొరిదిసేవలొనర్ప
నందిభృంగిరిటులు ♦ నందడింప
గీ॥ సంజవేళలఁదాండవ ♦ సక్తిమోద
మొనరుచుఁగొల్చువారెధ ♦ న్యులుగదయ్య  ౮౧

సీ॥ సర్వస స్థితుఁడవై ♦ యుర్వినొప్పెదునిన్ను
నావాహనముననె ♦ ట్లలరఁజేతు
శిరసునసురగంగ ♦ చెలఁగియుండెడునీకు
నభిషేచనంబెట్లు ♦ లాచరింతు
నిఖిలదిగంబరా ♦ న్వితుఁడవై చనునీకు
వసనంబులేమినే ♦ నొసఁగఁగలను
మణులరంజిల్లెడు ♦ ఫణులుదాల్చెడునీకు
నేభూషణంబుల ♦ నీయఁగలను
గీ॥ షడ్గుణైశ్వర్యయుక్తుఁడై ♦ జరగునీకు
దేవ! యేమీయఁగలనునన్ ♦ బ్రోవుమయ్య! ౧౨

సీ॥ స్వామికిద్రోహంబు ♦ సలుపంగ నెంచుభ
స్మాసురుండేమయ్యె ♦ ననఁగవినమె
యతిసాత్వికులనుదే ♦ వతలబాధించుపు
రాసురులేమయి ♦ రనఁగవినమె
జగములొక్కటిగమ్రిం ♦ గఁగఁదలంపొందుగ
జాసురుండేమయ్యె ♦ ననఁగవినమె
విష్ణుభక్తులదుర ♦ పిల్లఁగాఁజేయుదై
త్యస్వాములేమయి ♦ రనఁగవినమె
గీ॥ ధర్మముఁద్యజించియధికదు ♦ ష్కర్ములైన
వారలాగతులొందుట ♦ బ్రంబెదేవ! ౧౩

సీ॥ కలధౌతపర్వతం • బులు రెండుమందిర
కోదండములుగనా • మోదమిడఁగ
షడ్గుణైశ్వర్యముల్ • సరసఁబాదములాశ్ర
యింపఁగుబేరుండు • హితుఁడుగాఁగ
మందాకినీసర్వ • మంగళాదేవులు
నొగిభక్తి నీపాద • యుగళిఁగొలువ
భక్తార్తలోకనం • పత్కారిఘునకృపా
వీక్షణుండైన నీవ • వెలయుచుండ
గీ॥ నేకతంబునభిక్షుకుం • డైకడింది
పుణుకఁజేఁబూనితిరిగెదు • భూరితేజ! ౮౪

సీ॥ కేళికాభవనముల్ • లీలమైఁగట్టించి
యందుబంగరుడోల • లందునూఁగి
రమణీయమణిఖచి • తములునౌముక్తాభ
రణములుగమశరీ • రమునఁబూని
కస్తూరికాగురు • ఘనసారచందనా
ద్యనులేపనంబుల • హాయినొంది
నవ్యమృదంగవీ • ణావేణునిస్వన
శ్రవణసౌఖ్యములపి • శాంతిగాంచి
గీ॥ మైమఱచిభోగములఁగను • మరగివఱలు
వారలకుముక్తికినినెంత • దూరమొకద ౮౫

సీ॥ తలఁపులునీపద • ధ్యానముల్ గాఁగవా
క్రతులుపూజార్చనం • క్రమములుగాఁగ
నిరుపమభక్తియే • వరదుగ్ధములుగాఁగ
మహితసుజ్ఞానంబు • మధువుగాఁగ
వైరాగ్యభూతియే • నీరాజనముగాఁగఁ
బరమవహానంబుదీ • పంబుగాఁగ
శాంతియుదాంతియు • శౌచంబుదయయును
సురుచిరతరపరి • కరముగాఁగ
గీ॥ నలువసుమదాత్మభవదాస • నంబుగాఁగ
నిన్ను నర్చింతుసతతంబు • నీలకంఠ! ౮౬

సీ॥ భయదకంటకసంత • తియుతమైనఁజలియు
నీభూషణములతో • నెమ్మిఁగొందు
భ్రమరసంతానకా • శ్రయములేకుండియు
నీభూతిసంభూతి • నెమ్మినొందు
మార్దవఘనసౌకు • మార్యముల్ లేకుండి
నీవాసభూముల • నెమ్మినొందు
సుకుమారసుమశోభ • శోభిల్లకుండియు
నీధ్యానచింతన • నెమ్మినొందు
గీ॥ నట్టికేతకివిషువంగ • నగునెదేవ!
యైనసత్యదూరులగతి • యట్టిదేమొ ౮౭

సీ॥ భీకరారణ్యమై • పెంపొందునదియును
స్వల్పదావాగ్నిచేఁ • గాల్పఁబడదె
యఖిలదిగంతవి • శ్రాంతమహాచీఁకటి
యరుణోదయంబున • నడలుగొనదె
చటులకర్దమసమా • శ్రయమైనదేహమ్ము
నిర్మలోదకముల • నీటుగనదె
సతతశ్రమలనునా • ర్జితమైనవిత్తమ్ము
త్రుటిలోనఁజోరుసం • దిటనుబడదె
గీ॥ కొంచెమయ్యునునీసేవ • కుందఁజేయు
బహుళజన్మార్జితానేక • పాపచయము ౭౭

సీ॥ స్థావరజంగమా • త్మకమైనవిశ్వధ
రాతలంబునునాట్య • రంగముగను
స్త్రీపురుషాదివి • శేషభేదములఁద
నర్చుమానవులను • నటకులుగను
జేయుచువారికి • చిత్రవేషభాషల
నొసఁగుచుమఱిఁదత్త • దుచితరీతిఁ
గొందఱనవ్వించి • కొందఱనేడ్పించి
కొందఱసౌఖ్యంబు • నొందఁజేసి
గీ॥ విశ్వనాటకమాడించి • వెలయుచున్న
సూత్రధారివి; నీలీల • సుమ్ముజగము ౭౮

సీ॥ సామేనుగొనసతి ♦ యామోహినీరూపుఁ
డౌహరియునుదక్క ♦ దేహముఁగొన
నిలువఁదానములేక ♦ నింగికై చంద్రుండు
భూమికై జాహ్నవి ♦ పోయెనుఱియు
భూభారమువహింప ♦ భోగినాథుండేగెఁ
గాననంబుననిట్టి ♦ కలయఁజొచ్చె
నావృషభేంద్రుండు ♦ నాలమందలఁజేరెఁ
బ్రేతభూమికినేగె ♦ భూతచయము
గీ॥ భక్తజనములదర్శన ♦ ప్రాప్తికొఱకు
నీచిదాత్మయలింగమై ♦ గోచరించె ౯౦

సీ॥ ఉదయానఁదానంబు ♦ నదిలోనఁగావించి
నీకునీరంబుఁదే ♦ లేకయుంటి
శ్రమకోర్చిబిల్వముల్ ♦ సరసిజంబులుదెచ్చి
నిన్నర్చసేయక ♦ మిన్నకుంటి
లోభాదిగుణముల ♦ లోలుండనై నీకు
భక్త్యనివేదనల్ ♦ పరుపకుంటి
శ్రీకరపంచాక్ష ♦ రీమంత్రపఠనాను
మోదినై పుణ్యానఁ ♦ బోవకుంటి
గీ॥ దేవ! నేనపరాధిని ♦ దీనుఁడనుగ్ర
పావనధివీవుననుఁబ్రోవు ♦ దేవదేవ! ౯౧

సీ॥ జననస్థితిలయంబు ♦ లనొనర్చునెవ్వాఁడు
సుమహితాజాండభాం ♦ డములకెల్ల
నామరూపరహితుఁ ♦ డై మించునెవ్వాఁడు
సగుణుఁడై యెవ్వాఁడు ♦ జరగునొకట
నవ్యక్తుఁడై బ్రహ్మ ♦ మైయనంతుండయి
యమృతుఁడై యమరుఁడై ♦ యడరునెవ్వఁ
డాత్మయైసాక్షియై ♦ యప్రమేయుండయి
యెవఁడుచిన్మయుడై ర ♦ హించుచుండు
గీ॥ నట్టియఖిలాత్మునకుమహి ♦ మాధిపునకు
నీకుమ్రొక్కెదనతుఁడనై ♦ నిత్య!యభవ! ౯౨

సీ॥ బ్రహ్మచర్యగృహస్థ ♦ వనవాసయత్యాశ్ర
మంబులునాలుగు ♦ మహినెసంగు
నవ్వానిలోఁగడు ♦ నదిలెస్సయిదిలెస్స
యనియవివేకులౌ ♦ జనములంద్రు
నాల్గింటనెద్దియైన ♦ నలువారఁగొనితదా
శ్రమధర్మనిరతులై ♦ చక్కనసువఁ
కైవల్యసంప్రాప్తి ♦ గాదొకో యేటికో
సందేహముబొంది ♦ సంసృతిఁబడి
గీ॥ మిగులఁదపియించుచుందుర ♦ మేయచరిత!
యట్టినబోటులనుగావు ♦ మా! గిరీశ! ౯౩

సీ॥ గాంభీర్యసారమ ♦ గడ్తగా మహనీయ
ధీరతాగరిమప్రా ♦ కారముగను
భక్తివైరాగ్యాది ♦ పరమగుణంబులు
నానాచమూవితా ♦ నములుగాఁగ
నగణితవిద్యయే ♦ యదిబొక్కసముగాఁగ
నొనరమేధయయమా ♦ త్యుండుగాఁగ
నక్షంబులునవ ♦ ద్వారముల్ గాఁగహృ
దయదుర్గమెంతయుఁ ♦ దనరుదేవ!
గీ॥ రమణ! శంకర! నీవుదు ♦ ర్గాప్రియుండ
వౌటనద్దానివసియింపు ♦ మయ్యనెమ్మి; ౯౪

సీ॥ ఖరకరకరదీప్తి ♦ విరిసిన తామర
సవనినాడెడుమాన ♦ సౌకముగతి
రాకాసుధాకర ♦ రమ్యకౌముదులలోఁ
దమినాడెడుచకోర ♦ కములరీతిఁ
గాడంబిసీసమా ♦ గమమునసానంద
మొందినటించుమ ♦ యూరమట్లు
లర్యమోదయమున ♦ నతికౌతుకంబార
భార్యఁగూడెడుచక్ర ♦ వాకములలి
గీ॥ బాళిఁతపసులకునెఱుంగ ♦ రానియట్టి
నీదుపదదర్శనంబొంది ♦ నెమ్మిఁగందు ౯౫

సీ॥ రజతాద్రిభర్మహ ♦ ర్మ్యంబునగణములు
గొలువహైమవతిసే ♦ వలనొనర్ప
సచ్చిదానందర ♦ సమునఁదేలాడెడు
శ్రీకంఠునెదుటనా ♦ సీనుఁడనయి
కడుభక్తి వినతులు ♦ గావించియోసాంబ!
యోభవానీనాథ! యోమహేశ!
యోకరుణావార్ధి! యోకల్పకాల్ప!
యనిబ్రహ్మకల్పంబు ♦ లవినిమేష
గీ॥ ములుగగడపెడుభాగ్యమె ♦ వ్వఁడుగలుగునొ
యనుచుఁగౌతూహలంబొందు ♦ దునుమహాత్మ! ౯౬

సీ॥ మానసధనువును ♦ మహితతపోమార్వి
చేనెక్కువెట్టియు ♦ హీనభవ్య
మంత్రసత్పరవాస్త్ర ♦ మండలిదారుణ
షడ్వర్గశత్రువీరా ♦ జన్యవితతిఁ
బాఱఁదోలుచునహం ♦ కారనిరంకుశ
పరిపాలనమ్ముమా ♦ పఱనొనర్చి
దాంతిదయాధర్మ ♦ శాంతివైరాగ్యాది
లలితసోపానపం ♦ క్తులనమర్చి
గీ॥ జ్ఞానసౌధాగ్రమెక్కిమో ♦ క్షసతిఁగూడ
భవ్యనిర్వాణసుఖమందు ♦ వాఁడెయోగి ౯౭

సీ॥ సురదైత్యహరిపురం ♦ దరకిరీటమణీఘృ
ణీజాలభవ్యనీ ♦ రాజనములు
భక్తమానసలస ♦ త్పద్మాకరచరద్వి
రంసవిధారాజ ♦ హంసకములు
సంతతధ్యానని ♦ ష్ణాతత్పరసుయోగి
ధీదరీకుహరాళి ♦ దీపకములు
పాపపంకనిమగ్న ♦ బహుమూఢలోకావ
నైకదీక్షాసుఖ ♦ శ్రీకరములు
గీ॥ మోక్షలక్ష్మీకటాక్షవి ♦ భూతిదములు
భవ! భవత్పూతదివ్యాంఘ్రి ♦ పల్లవములు ౯౮

సీ॥ గృహమునందైనను ♦ గుహనైననువనంబు
నందైనబహిరంగ ♦ మందునైన
నివసింపలాభము ♦ న్నెమహానుభావ! ని
ర్మలమానసాంతర ♦ మంటపమున
భవదీయపావన ♦ పదపద్మములనిల్పి
సేవింపఁజిత్సుఖ ♦ శ్రీదనర్చుఁ
గాకబాహ్యవిశేష ♦ కారణంబులగణిం
పఁగరాదునినుఁగొల్చునట్లదేవ!
గీ॥ నిర్మలమనోగృహంబున ♦ నిన్నుఁగొల్చు
వారెశివయోగులనఁ ♦ బరువారుగిరిశ! ౯౯

సీ॥ దేవుండవుప్రభుండ ♦ వీవుదీనులనుగా
వఁగసమర్థుఁడవుశి ♦ వాసనాథ!
దీనముఖ్యుఁడనేను ♦ గానబంధుఁడనీకు
ననుఁగరుణింపుము ♦ నాథనాథ!
యేఁజేసినట్టిదు ♦ ష్కృతములనెన్నంగఁ
దలమె? తావకకృపా ♦ విలసితేక్ష
ణార్కమరీచుల ♦ నవితొలంగునుగాని
మఱలనావలనరూ ♦ పఱునెయవియుఁ
గీ॥ పతితపావనబిరుదాంక! భద్రమూర్తి
నన్ననతిదీనుఁగావుము ♦ నాథనాథ! ౧౦౦

సీ॥ మల్లలాటంబున ♦ నల్లనఁడావార్తిసెఁ
దామరసభవుండు ♦ దైన్యరేఖ
దానఁడావకకృపా ♦ ర్ద్రవిలోకనములకుఁ
బాత్రుండనైతిని ♦ భద్రచరిత!
కాననవ్విధివార్తిత ♦ కలితశుభావహ
ముయ్యోనాకిరయదే ♦ వాదిదేవ!
„నాభక్తునకునుదై ♦ న్యంబుగావింతువె?"
యనియాగ్రహింపకు ♦ మతనిమీఁదఁ
గీ॥ దక్కఁగలనాల్గుతలలను ♦ దయననుగ్ర
హింపుకోపంబునుపసంహ ♦ రింపునాథ! ౧౦౧

సీ॥ భయదకీలాకలా • పకలాపమైనయా
కాలకూటవిషంబుఁ • గ్రోలుటయును
నల్లోలదారుణ • కల్లోలవతిగంగఁ
దలపువ్వుగాఁజడఁ • దాల్చుటయును
మొదలుతుదిఁగనఁ • బోఁడఁగానరాక
మురహరువిధిమాయ • ముంచుటయును
ననితరసామాన్య • ఘనసత్వగరిమచేఁ
ద్రిపురాసురులసంహ • రించుటయును
గీ॥ నీకుఁగాకన్యులకుఁజెల్లు • నేమహాత్మ!
యట్టినినుఁగొల్చుధన్యుండ • నగుదుదేవ! ౧౦౨

సీ॥ రమణీయదేహగే • హముశుద్ధిగావించి
హృదయమంగళమునై • యెసకమెసఁగు
నుద్వాహతంత్రంబు • నొనరింపఁబూనిభ
క్తిగుణావృతమ్మును • గేవలసుఖ
పాథస్సమేతంబు • భద్రంబునగుమదీ
యహృదయపాత్రంబు • నందునీదు
కలితాంఘ్రిపల్లవో • త్కరముంచిపుణ్యాహ
మొనరించెదను దాని • కోర్కెమిగను
గీ॥ సచ్చిదానందరూప! శా • శ్వత! యనంత!
దీనజనలోకసంత్రాణ! దేవదేవ! ౧౦౩

సీ॥ వీఁడిఁక మహిఁ బుట్టు ♦ వీని చిత్తంబది
కిఁ దినమాడఁ జరింపఁ ♦ గలుగునాకు
ననియెంచి కృపనన్నుఁ ♦ గనుఁగొన నేనిటఁ
బుడమి జనింపక ♦ మున్నె నీవు
ధరణీధరంబులఁ ♦ జరియించు నభ్యాస
మొనరించితటుగాక ♦ యున్న దేవ!
మేఁడలు పూవుల ♦ మేలిమి పాన్పులు
పువుటీరములు నుబు ♦ ప్పాడిఁ దనర్చు
గీ॥ దారులును గల్గఁ గొండనె ♦ త్రమ్ములఁ దారి
నృత్య మొనరింప నేలయ్య ♦ నీలకంఠ! ౧౦౪

సీ॥ రవిజుని దన్నిమా ♦ ర్కండేయుఁ గాచిన
దేవాది దేవ! నన్ ♦ బ్రోవుమయ్య!
పంది కై పోరాడు ♦ ఫల్గుని మెచ్చిన
దేవాది దేవ! నన్ ♦ బ్రోవుమయ్య
భక్తి నిన్ బూజించు ♦ బోణురక్షించిన
దేవాది దేవ! నన్ ♦ బ్రోవుమయ్య!
సిరియాళుని కనుని ♦ ద్రేయ సంబోసఁగిన
దేవాది దేవ! నన్ ♦ బ్రోవుమయ్య!
గీ॥ దినములఁ బాదాబ్జపూజసే ♦ సిన దశాస్యుఁ
బ్రోచిన మహానుభావ! నన్ ♦ బ్రోవుమయ్య! ౧౦౫

సీ॥ సూరిజనస్తోత్ర • సుందరాపస్తంభ
సూత్రుండఁ గాశ్యప • గోత్రజుండ;
మావుడూర్వంశపా • రావారచంద్రుఁడౌ
నరసయార్యునకును • న్మండమఱియు
నప్పన్న భక్తుని • నమ్మనాంబకునునే
నగ్రసుతుండన • మగ్రబుద్ధి
మల్లికార్జునుఁడని • మాన్యులనుఁబిల్వఁ
బరగువాఁడనుభవ • ద్భక్తిపరుఁడ.
గీ॥ నభవ! యష్టోత్తరశతప • ద్యసుమములను
నిన్నుఁ బూజింపఁ బూనితి • నిగమవినుత! ౧౦౬.

సీ॥ వినుతకశ్యపగోత్ర • ఘనుఁడైన మావుడూ
ర్వంశవారాశిశ • రద్విధుండు
నరసయార్యునకును • వరమహాలక్ష్మికి
జ్యేష్ఠపుత్త్రుండుగుణ • శ్రేష్ఠుఁడు మఱి
వేదశాస్త్రవిదుండు • వేంకటరమణుండు
నీయాలయమ్మును • నెగడఁజేసి
మరలఁ బ్రతిష్ఠఁ దా • నరయఁ గావించియు
సర్వాంగశోభాతి • శయమొనర్చె
గీ॥ నట్టినీప్రియభక్తుని • పట్టిగాఁగ
ననెంచి నీదుసాన్నిధ్యమం • దిడితి దేవ! ౧౦౭

సీ॥ మృత్యుంజయునినిన్ను ♦ నిత్యంబుభజియింప
సంపదున్నతియుమో ♦ క్షంబుగలుగు
సతతంబునీనామ ♦ సన్నుతిగావింపఁ
బాపాటవీతతుల్ ♦ భస్మమగును
నీసీసశతకంబు ♦ నెప్పుడుచదివెడు
వారికిఁగలుగుశు ♦ భప్రచయము
వ్రాయువారలకును ♦ శ్రీయువిద్యయుగల్గు
వినినవారికిఁబుత్ర ♦ వితతిగలుగు
గీ॥ చంద్రశేఖర!ఖరకర ♦ చంద్రవీతి
హోత్రలోచన!దేవతా ♦ స్తోత్రపాత్ర!
సుందరశరీరరుచిజితకుంద! సుంద
రాపురనివేశ! మల్లేశ్వరా! మహేశ! ౧౦౮

శ్రీ మల్లేశ్వరశతకము.

సంపూర్ణము.

## శ్రీ మల్లికేశ్వరాష్టకం

శ్లో॥ శ్రీశపూజితమాదిభిక్షుముమాపతింభవతారకం।
భూజలానలవాయుఖార్క శశీశసోమపరూపిణం।
స్వర్ణదీలసదుత్తమాంగమగాధిరాజనుతిప్రియం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ ౧

శ్లో॥ నారదాదిమునీంద్రసన్నుతవైభవంవృషభధ్వజం।
వారణాస్యషడాస్యసేవితనైజతత్వకలాపకం।
రాజరాజసుహృత్తమంద్విజరాజశేఖరమద్వయం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ ౨

శ్లో॥ అంబరాంబరమంబికాహృదయారవిందదివాకరం।
దందశూకవిభూషణంభసితాంగరాగమనోహరం।
మృత్యుభీతమృకండుపుత్త్రకరక్షకంసుఖదాయకం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ 3

శ్లో॥ ఆశ్రితామరపాదపంశ్రుతివేద్యమాద్యమనామయం।
యోగిహృద్యమకల్మషంకలుషాపహంత్రిగుణాత్మకం।
అంతకాంతకమవ్యయంపరమేశ్వరంపురుషార్థదం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ ౪

శ్లో॥ దృప్తరావణబాహుదర్పవిభేదనంశ్రితకామ్యదం
నందికేశ్వరచిత్తపంజరకీరభూతమనీశ్వరం।
బాణభార్గవహృత్సరోవరరాజహంసమకారణం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ ౫

## శ్రీ మల్లికేశ్వరాష్టకం

శ్లో॥ సృష్టిపాలననాశకారిణమామయాధివినాశనం।
కాలకూటవినీలకంఠమకాలమృత్యువిదారిణం।
దారితాఖిలవైరిమస్తకసర్వశక్రతునాశనం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ ౬

శ్లో॥ భక్తరక్షణదుష్టశిక్షణవీక్షితంభువనాధిపం।
పంకజాసనపద్మలోచనపాకశాసనసేవితం।
లోచనీకృతభాస్కరేందుధనంజయంసకలేష్టదం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥ ౭

శ్లో॥ భూరథంశ్రుతివాజినంవిధిసారథింపణిరాడ్గుణం।
కార్ముకీకృతస్వర్ణభూధరమంబుధీషుధిమక్షరం।
మార్గణీకృతశౌరిణంపురదైత్యదాహవిశారదం।
సుందరాపురమల్లికేశ్వరమాశ్రయేకరుణానిధిం॥

శ్లో॥ తెల్లిచర్లకులాబ్ధిచంద్రనృసింహభానునిర్మితం।
మల్లికేశ్వరనామకాష్టకమాదరాత్పఠతాంసదా।
దీనబంధురుమాపతిశ్శశిశేఖరఃకరుణాకరః।
శ్శంకరఃకృపయాదిశత్వఖిలార్థసిద్ధిమనారతం। ౯

శ్లో॥ మల్లికేశ్వరవిశ్వశరచితం స్తవనంతవ।
అర్పితంపాదమూలేతుకృపయాపాహిమాంసదా॥ ౧౦

ఇతిశ్రీమల్లికేశ్వరాష్టకంసమాప్తమ్ ప్రజోత్పత్తిసంవ
త్సర కార్తీకకృష్ణైకాదశీ స్థిరవాసరః తే 5_12_1931 ది